**అగ్నిపీఠపూజ :**

కుండము లోపల దశ(10) దిక్కుల యందు అక్షతలతో పూజించవలెను.

1. తూర్పు - ఓం పీతాయై నమః
2. ఆగ్నేయ - ఓం శ్వేతాయై నమః
3. దక్షిణం - ఓం అరుణాయై నమః
4. నైఋతి - ఓం కృష్ణాయై నమః
5. పడమర - ఓం ధూమ్రాయై నమః
6. వాయవ్యం - ఓం తీవ్రాయై నమః
7. ఉత్తరం - ఓం విస్ఫులింగిన్యై నమః
8. ఈశాన్యం-ఓం రుచిరాయై నమః
9. ఊర్ధ్వము - (ఈశాన్యము - తూర్పు మధ్య) ఓం జ్వాలినై నమః
10. అధోదిక్కు- (నైఋతి-పడమర మధ్య) ఓం రం సర్వశక్తి కమలాసనాయ నమః

**ఆసన పూజ :**

**"రం వహ్న్యాసనాయనమః"** అని అగ్ని ఆసనమునకు నమస్కరించాలి.

**అగ్ని జ్వలనము :**

హోమకుండంలో చిన్న కట్టెముక్కలు, పిడకల ముక్కలు వేసి, వానిపై కర్పూరముపెట్టి అగ్నిని వెలిగించవలయును. **8** సార్లు **'ఓం'**కారమును ఉచ్చరించి అమృత బీజమగు **'వం'** మూడుసార్లు ఉచ్చరించి **'రం'** అను అగ్నిబీజమును **7** సార్లు ఉచ్చరించి **'రం వహ్ని మూర్తయేనమః** అనుచూ మంటలోనికి అగ్నిదేవుడు దిగినట్లుగా భావించి నమస్కరించాలి.

కుడిచేతిలో నీళ్ళుపోసుకొని కుండము చుట్టూ **'హుంఫట్'** అని పలుకుచూ అగ్నిచుట్టూ రక్షాకవచము నిర్మించినట్లు భావించుచు నీరు పోయాలి.

మండుచున్న కట్టెపుల్లలో నుండి ఒకపుల్లను తీసి **హూంఫట్ క్రవ్యాదేభ్యః స్వాహా** అనుచూ నైఋతి దిక్కున వేసి దానిని రాక్షసులకు అర్పించినట్లు భావించాలి.

అగ్నిదేవుడు పూర్తిగా అవతరించి అనుగ్రహించుట కొరకు ఈ మంత్రములు చదవాలి.

1. భూర్భువస్సువరోం  2. హ్రూం వహ్నిచైతన్యాయ నమః

3. చిత్పింగళ హనహన దహదహ పచపచ సర్వజ్ఞ అజ్ఞాపయ స్వాహా.

4. హ్రీం హ్రీం జ్వలజ్వల ప్రజ్వల ప్రజ్వల హుం ఫట్స్వాహా.

5. ఓం వైశానర జాతవేద ఇహావహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయస్వాహా.

6. అగ్నిం ప్రజ్వలితం వందే జాతవేదం హుతాశనం, సువర్ణ వర్ణమమలం సమిద్ధం విశ్వతోముఖం – **అని అగ్ని దేవునకు నమస్కరించాలి.**

**పంచ పూజలు :**

**ఓం –** అగ్నయేనమః పాద్యం సమర్పయామి,
అర్ఘ్యం సమర్పయామి, ఆచమనం సమర్పయామి
అని ఉద్ధరిణెడు నీళ్ళు మూడుసార్లు కుండములో వేయాలి.

**లం –** పృధ్వీతత్వాత్మికాయ నమః – గంధం ధారయామి
అని తడి గంధమును చల్లాలి.

**హం –** ఆకాశతత్వాత్మికాయ నమః – పుష్పైః పూజయామి
అనుచు పూలు వేయాలి.

**యం –** వాయుతత్వాత్మికాయ నమః – ధూపమాఘ్రాపయామి
అని అగరువత్తితో ధూపము చూపించాలి.

**రం –** తేజస్తత్వాత్మికాయ నమః – దీపం దర్శయామి
అనుచు దీపమును వెలిగించి చూపించాలి.

*'ధూప దీపానంతరం ఆచమనం సమర్పయామి'*
అనుచు ఒక చుక్క నీరు వేయాలి.

**వం –** అమృత తత్వాత్మికాయై నమః' 'నైవేద్యం సమర్పయామి'
అనుచు మధుర పదార్థములను / సున్నుండ / పండ్ల ముక్కలు
శ్రీ వటుకభైరవ దేవతామంత్రము చదువుచూ సమర్పించాలి.

ఎదురుగా నేతిపాత్రను పెట్టుకొని దర్భతో కుండములో దానిని కాల్చి

ఆ మంటను నేతిలో ప్రతిఫలింప చేయాలి. ఆహుతులు వేయుటకు **'స్రుక్కు'** (కొయ్యతోచేసిన పెద్ద మూతిగల పొడుగాటి గరిటె) **స్రువము** (కొయ్యతో చేసిన చిన్న మూతిగల చెంచావంటిది) ఉపయోగించాలి.

పాత్రలో నుండి స్రువముతో కుడిప్రక్క నుండి నేతిని తీసికొని **'ఓం అగ్నయే స్వాహా'** అని ఆహుతి వేయాలి. ఎడమభాగము నుండి నమః అని తీసికొని **'ఓం సోమాయస్వాహా'** అని ఆహుతి వేయాలి. మధ్య నుండి తీసికొని **ఓం అగ్ని సోమాభ్యాం స్వాహా** అని ఆహుతి వేయాలి.

మరల కుడివైపు నుండి **నమః** అని తీసుకొని **ఓం అగ్నయే స్విష్ట కృతే స్వాహా** అని ఆహుతి వేయాలి. మధ్యనుండి నేతిని తీసుకొని

1. ఓం భూః స్వాహా
2. ఓం భువః స్వాహా
3. ఓం సువః స్వాహా
4. ఓం భూర్భువస్సువః స్వాహా

అని ఆహుతులు వేయాలి.

**"ఓం వైశ్వానర జాతవేద ఇహావహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయస్వాహా"**

అని **3** సార్లు ఆహుతులు వేయాలి.

***ఈ క్రింది మంత్రములతో ఒక్కొక్క ఆహుతిని వేయాలి.***

1. ఓం అగ్నిజిహ్వాభ్యః స్వాహా
2. ఓం జిహ్వాధిదేవతాభ్యః స్వాహా
3. ఓం షడంగదేవతాభ్యః స్వాహా
4. ఓం అష్టమూర్తిభ్యః స్వాహా
5. ఓం అష్టమాతృకాభ్యః స్వాహా
6. ఓం అష్టభైరవేభ్యః స్వాహా
7. ఓం అష్టదిక్పాలకేభ్యః స్వాహా

స్రువముతో **4** సార్లు నేతిని తీసికొని స్రుక్కునందు వేసి దానిపై ఒక పువ్వు నుంచి స్రువమును దానిపై బోర్లించి **"ఓం వైశ్వానర జాతవేద ఇహావహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయ వౌషట్"** అనుచు ఆహుతి వేయాలి.

**ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే పరవరద సర్వజనంమే వశమానయ స్వాహా స్వాహా** అనుచు ఒక ఆహుతి వేయాలి.

**శ్రీ గురుభ్యోనమః స్వాహా** అని గురువును స్మరించుచూ ఒక ఆహుతి వేయాలి.

**'ఓం హ్రీం సిద్ధగురోప్రసీద హ్రీం ఓం"** అని **11** ఆహుతులు స్వాహంతముగా వేయుట అధిక ఫలదాయకము.

**ఓం శ్రీ వటుకభైరవ దేవతా యోగపీఠాయ నమః స్వాహా** అనుచూ ఒక ఆహుతి వేయాలి.

**హ్రీం బటుకాయ ఆపదుద్ధరణాయ కురుకురు బటుకాయ హ్రీం**

ఆ తరువాత పై వటుకభైరవదేవతా మంత్రమును **10** సార్లు ఉచ్చరిస్తూ దేవతను అగ్నియందు అవతరింప చేయాలి. ప్రాణప్రతిష్ఠా మంత్రము పురశ్చరణ చేసినవారు దానిని ఉపయోగించవచ్చు.

అగ్ని, ఇష్టదేవతల ముఖము ఒకటి అగుటకు శ్రీ వటుకభైరవ దేవతా మంత్రముతో **25** ఆజ్యా ఆహుతులు స్రువముతో వేయాలి. ఇద్దరు దేవతలనాడులు ఒకటి అగుటకు **11** ఆజ్యా ఆహుతులు శ్రీ వటుకభైరవ దేవతా మంత్రముతో వేయాలి.

ఇప్పుడు దేవత అగ్నిలోకి అవతరించినది కనుక పాద్యము, అర్ఘ్యము, ఆచమనము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము సమర్పించాలి. నైవేద్యమును శ్రీ వటుకభైరవ దేవతా మంత్రము చెప్పుచూ స్వాహా అనుచూ అగ్నిలో వేయాలి.

తరువాత శ్రీ వటుకభైరవ దేవతా మంత్రముతో 10 ఆహుతులు వేయాలి. స్రుక్కు, స్రువములేనివారు ఉద్ధరిణలు వాడవచ్చు.

ఇప్పుడు సాధకులు తన ప్రయోజనమును అనుసరించి తగిన వస్తువులతో హోమము చేయాలి.

**హ్రీం బటుకాయ ఆపదుద్ధరణాయ కురుకురు బటుకాయ హ్రీం స్వాహా**

అని మూలమంత్రాన్ని ఉచ్ఛరిస్తూ ఆహుతులు వేయాలి. చేయదలచుకొన్న ఆహుతుల సంఖ్య పూర్తయిన తరువాత ఈ క్రింది మంత్రములతో మహావ్యాహృతి హోమము చేయాలి.

1. ఓం భూః అగ్నయే చ పృథివ్యై చ మహతే చ స్వాహా
2. ఓం భువః వాయవేచ అంతరిక్షాయ చ మహతే చ స్వాహా
3. ఓం సువః ఆదిత్యాయ చ దివే చ మహతే చ స్వాహా
4. ఓం భూర్భువస్సువః చంద్రమసే చ నక్షేత్రభ్యశ్చ దిగ్భ్యశ్చ మహతే చ స్వాహా

అనుచు **4** ఆహుతులు సమర్పించాలి. *తరువాత*

*బ్రహ్మార్పణ మంత్ర హోమము.*

**ఓం తత్సత్ ఇతః పూర్వం ప్రాణబుద్ధి దేహధర్మాధికార జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థాసు మనసావాచా కర్మణాయత్స్మృతం యదుక్తం యచ్చకృతం తత్సర్వం బ్రహ్మార్పణం భవేత్ భూఃస్వాహా** – అని ఆహుతి వేయాలి.

**దేవతా బలి :**

పూర్ణాహుతి ముందు 'మంచి గుమ్మడికాయ' మంత్ర పూర్వకముగా ఖండించి సమర్పించవచ్చు. ఇది ఆటంకములను, ఆపదలను తొలగించి అభీష్టములను ప్రసాదిస్తుంది. లేదా కొబ్బరికాయ పూర్తిగా పీచుతీసి కుంకుమరాసి పగులకొట్టి **శ్రీ వటుకభైరవ దేవతాయై బలిం సమర్పయామి** అంటూ కుండములో వేయవచ్చు.

**పూర్ణాహుతి :**

పూర్ణాహుతి ద్రవ్యాన్ని ఒక పళ్ళెంలో వుంచి శ్రీ వటుకభైరవ దేవతా మంత్రంతో **12** సార్లు స్రువముతో నేతిని ఆ ద్రవ్యంపై వేసి స్రుక్కుపై స్రువాన్ని బోర్లించి

**హ్రీం బటుకాయ ఆపదుద్ధరణాయ కురుకురు బటుకాయ హ్రీం వౌషట్**

అని మూలమంత్రాన్ని చెబుతూ నిలబడి **'పూర్ణాహుతింజుహోమి'** అనుచు అగ్నిలో వేయాలి. పూర్ణాహుతి ద్రవ్యములతో పాటు కొబ్బరికాయగాని, ఖర్జూరకాయ గాని, పోకకాయ (వక్క)కాని దేవతావర్ణము గలిగిన పట్టుగుడ్డలో పెట్టి పూర్ణాహుతి ద్రవ్యముగా ఉపయోగించవచ్చు. దీనిలో నవరత్నాలు కూడా వేయవచ్చు. ఇందులో నేతితో 12 ఆహుతులు మాత్రమే విధి. మిగిలినవి అధిక శక్తిదాయకాలు మాత్రమే.

**దిక్పాలక బలి :**

పూర్ణాహుతి అనంతరము, దిక్పాలకులకు ఎర్ర అన్నము ముద్దగాని, కోసి కుంకుమ అద్దిన నిమ్మకాయడిప్పగాని ఈ క్రింది మంత్రములు చెప్పుచూ బలి సమర్పించాలి. కుండము బయట **8** దిక్కులలో తమలపాకులు పెట్టి ఆయాదిక్కులలో బలి సమర్పణ చేయాలి.

1. తూర్పు-**లం** ఇంద్రాయ నమః
2. ఆగ్నేయము-**రం** ఆగ్నేయ నమః
3. దక్షిణము-**హం** యమాయ నమః
4. నైఋతి-**షం** నిఋతయే నమః
5. పడమర-**వం** వరుణాయ నమః
6. వాయవ్యము-**యం** వాయవే నమః
7. ఉత్తరం-**సం** సోమాయ నమః
8. ఈశాన్యము- **శం** ఈశానాయ నమః
9. ఊర్ధ్వం- **ఆం** బ్రహ్మణే నమః
10. అధో- **హ్రీం** అనంతాయ నమః

**(ఈ పది దిక్కుల మంత్రాలకు చివర వున్న నమః తరువాత**
**బలిం సమర్పయామి అని చెప్పవలెను)**

**భూతబలి :** ఈశాన్యమున ఆకువేసి పెద్ద ఎఱ్ఱ అన్నము ముద్దపెట్టి ఈ క్రింది మంత్రముతో భూతములకు బలి సమర్పించాలి. లేదా కొబ్బరికాయకొట్టి కుంకుమవేసి నీరుచల్లి బలిని సమర్పించవచ్చు.

**"నమః సర్వ విఘ్న కృద్భ్యః సర్వభూతేభ్యో హుం ఫట్ స్వాహా"**

అని చెప్పి హోమకుండం చుట్టూ 3 సార్లు ప్రదక్షిణ చేయాలి. హోమ భస్మమును నేతితో కలిపి బొట్టు పెట్టుకోవాలి.

## వటుక భైరవబలిధానం

శారదాతిలకంలో బ(వ)టుక భైరవుడి బలి రెండు విధాలుగా చెప్పబడింది.

1. **రాజస బలి :**మాంసాదులు రక్తసహిత అన్నంతో సమర్పించేది.
2. **సాత్విక బలి :** పెసరపప్పు, పాయసం త్రిమధుర సమన్వితంగా సమర్పించేది. ఈ సాత్విక బలిని ఆచరించటం అందరికీ శ్రేయోదాయకం.

**బలిమంత్రం :** **ఏహి ఏహి విదుషి పురుపురు భంజయ భంజయ, నర్తయ నర్తయ విఘ్న విఘ్న 'బటుకభైరవ' బలింగృహ్ణ గృహ్ణ।**

ఈ మంత్రాన్ని పఠిస్తూ జపానంతం, హోమానంతం బటుక భైరవుడికి బలిని సమర్పించాలి.

**ఉద్వాసన :**

1. **దేవతకు – ఓం శ్రీ వటుకభైరవ దేవతా** నా అభీష్టమును నెరవేర్చి మరల నేను పిల్చినప్పుడు వచ్చునట్లుగా ప్రస్తుతము నీ స్వస్థానమునకు వెళ్ళవలసినదిగా ప్రార్థిస్తున్నాము" అని చెప్పి కుడిచేతిలో నీళ్ళుపోసుకొని కుండములో వదలాలి.
2. **అగ్నికి – ఓ అగ్నిదేవా!** నా అభీష్టమును ప్రసాదించి మరల నేను పిలిచినపుడు వచ్చునట్లుగా నీ స్వస్థానమునకు వెళ్ళవలసిందిగా ప్రార్థిస్తున్నాను. అని కుడిచేతిలో నీళ్ళు పోసుకొని కుండములో వదలాలి.

***దీనితో హోమము పూర్తవుతుంది.***

## హోమ వ్యవధి

దశాంశ హోమాన్ని లేదా కామ్యహోమాన్ని సాధకుల శక్త్యానుసారం 1-2-3-5 రోజులలో హోమం చేసుకోవచ్చు. ఈ రోజులలో హోమకుండంలో అగ్ని ఆరకుండా జాగ్రత్తపడాలి.

## పురశ్చరణకు హోమద్రవ్యములు

పురశ్చరణలో భాగముగా దేవతాప్రీతికి

1.నల్లనువ్వులు, 2.నువ్వులనూనె, 3.నువ్వుండలు, 4.మినుములు, 5.మినప సున్నుండలు, ఉలవలు, ఖర్జూరం 6.వివిధ రంగుల పువ్వులు, 7. వివిధ రంగుల ముగ్గుపిండి, 8. సమిధలు, 9.దర్భలు

## హోమము మధ్య లేవవలసిన వచ్చినచో

1. **ఓం భూః స్వాహా**
2. **ఓం భువః స్వాహా**
3. **ఓం సువః స్వాహా**
4. **ఓం భూర్భువస్సువః స్వాహా**

అని 4 ఆహుతులు వేసి లేచి మళ్ళీ వచ్చి ఇవే నాలుగు ఆహుతులు వేసి హోమము మరల చేయాలి. మధ్యకాలములో అగ్ని ఆరరాదు. ఒకరోజేకాక ఎక్కువ రోజులు చేసినా - ఇదే పద్ధతి.

**గమనిక :** శ్రీ వటుకభైరవ దేవతా మంత్రాన్ని దశాంశ హోమం చేసి పురశ్చరణ పూర్తిచేశాక సాధకులు తమ కామ్యహోమాల్ని చేసుకోవచ్చు. అంటే మీకు ఏ కోరిక వుంటే ఆ కోరిక సంకల్పంలో చెప్పుకుని ఆయా కామ్యాలకు శాస్త్రంలో చెప్పిన ద్రవ్యాల్ని ఉపయోగించి హోమాన్ని చేసుకుని శ్రీ వటుకభైరవ దివ్యానుగ్రహాన్ని పొంది తమ తమ కోరికలు నెరవేర్చుకోవచ్చు.

కామ్యహోమాలలో కూడా 'హోమవిధానం' ఒకటే. సాధకుల శక్త్యానుసారం పూర్తి హోమపద్ధతిగానీ, లఘుహోమ పద్ధతిగానీ ఆచరించవచ్చు.

## హోమ కుండాలు (శారదా తిలకం)

**చతురస్రం యోని మదర్ధచంద్రం త్ర్యస్రం సువర్తులమ్ ।**
**షడస్రం పంకజాకారమష్టాస్రం తాని నామతః ॥**

చతురస్రం, యోని, అర్ధచంద్రం, త్రికోణం, వర్తులం, షట్కోణం, పద్మాకారం, అష్టకోణం అని హోమకుండాలు 8 రకాలు.

| | |
|---|---|
| చతురస్రం | యోని |
| అర్ధచంద్రం | త్రికోణం |
| వర్తులం | షట్కోణం |
| పద్మాకారం | అష్టకోణం |

## వటుకభైరవ మంత్ర పురశ్చరణ

శారదాతిలకం ప్రకారం ఈ మంత్రాన్ని అక్షరలక్షలు అనగా 21 లక్షలు జపించి తద్దశాంశం అనగా రెండు లక్షల పదివేలసార్లు పాలు, తేనె, పంచదారతో కలిపిన నువ్వులు, హవిస్సుతో హోమం చేయాలి. మిగిలిన పురశ్చరణాంగాలన్నీ యధావిధిగా ఆచరించాలి.

## కామ్య ప్రయోగాలు

★ ధనధాన్యాది సంపదలు కోరుకునేవారు బియ్యం నువ్వులు కలిపి హోమం చేయాలి.

★ మారేడు ఫలాలతో హోమం చేస్తే ఐశ్వర్యం లభిస్తుంది.

★ త్రిమధురాలు అనగా పాలు, తేనె, పంచదార కలిపిన ఉప్పుతో హోమం చేస్తే స్త్రీ వశీకరణ కలుగుతుంది.

★ అన్నంతో హోమం చేస్తే ధనధాన్యాభివృద్ధి కలుగుతుంది.

★ కేవలం తేనెతో మూడురోజులు హోమం చేస్తే వశీకరణ సిద్ధి కలుగుతుంది.

★ ఉప్పుతో హోమం చేస్తే కారాగారం నుండి విముక్తి కలుగుతుంది.

★ ధనధాన్యాది సంపదలు కోరుకనేవారు నువ్వులు బియ్యంతో, మారేడు ఫలాలతో హోమం చేయాలి.

★ స్త్రీ వశీకరణ కోరుకనేవారు త్రిమధురాలు (తేనె-పాలు-పంచదార) కలిపిన ఉప్పుతో హోమం చేయాలి.

★ అన్నంతో హోమం చేస్తే ధనధాన్యాభివృద్ధి, తేనెతో హోమం చేస్తే వశీకరణ సిద్ధి కలుగుతాయి.

★ రోగనివారణ కోరుకునేవారు ఆయుర్వేదంలో రోగానికి చెప్పబడ్డ మూలికల్ని ఉపయోగించి హోమంచేస్తే ఆయా రోగాలు నివారించబడతాయి.

★ ఎవరైనా కారాగారం నుంచి విముక్తి పొందాలనుకుంటే ఉప్పుతో పదివేలసార్లు హోమం చేయాలి.

★ భూత, గ్రహబాధానివారణ జరగటానికి పదివేలసార్లు నువ్వులతో హోమం చేయాలి.

## శ్రీ దేవీ భాగవతంలో చెప్పబడిన కామ్యహోమ ద్రవ్యాలు

భగవాన్ వ్యాస మహర్షి రచించిన శ్రీ దేవీ భాగవతం సుప్రసిద్ధ పురాణ గ్రంథం. ఇందులో 11వ స్కంధం 23.వ అధ్యాయంలో వివిధ రకాల కామ్యాలకు (కోరికలకు) ఏఏ ద్రవ్యాలతో హెూమం చేయాలో తెలియచేయబడింది. ఉపాసకులు ఇక్కడ తెలుపబోయే ద్రవ్యాలతో హోమాలు చేసుకుని ఇష్టకామ్య సిద్ధిని పొందగలరని ఆశిస్తున్నాము.

| హోమ ద్రవ్యము | నెరవేరే కామ్యము |
|---|---|
| 1. పాలు, పెరుగు, నెయ్యి, పేలాలతో హోమం | - కన్యాలాభం, వరలాభం, - వివాహం |
| 2. మారేడు సమిధలు, ఆకులు, కాయలు, వేర్లు, పూలు వీటితో హోమం | - ఐశ్వర్యం ప్రదం. |
| 3. గరిక, పాలు, తేనె, పెరుగు, నెయ్యి | - అపమృత్యు నివారణ |
| 4. జిల్లేడు సమిధలతో హోమం | - సర్వత్రా విజయం, కార్యసిద్ధి |
| 5. ఉప్పు, తేనెలతో హోమం | - ఇష్టజన వశీకరణ |
| 6. ఎర్రకలువలు, జాజిపూలు, మల్లెపూలు | - ఐశ్వర్య ప్రదం |
| 7. పాలుగారె తిప్ప తీగతో హోమం | - ఆయుర్వృద్ధి, సర్వరోగహారం |
| 8. మామిడి చెట్టు సమిధలతో హోమం | - జ్వరరోగ హరం |
| 9. వచ (వస)తో హోమం | - క్షయరోగ ఉపశమనం |
| 10. మేడిచెట్టు సమిధలతో హోమం | - అతిమేహ రోగ హరం |
| 11. చెరుకు, తేనెలతో హోమం | - ప్రమేహ రోగ హరం |
| 12. అన్నంతో హోమం | - అన్నవృద్ధి |
| 13. పాయసం, నెయ్యితో హోమం | - సంతాన ప్రాప్తి |
| 14. మోదుగ సమిధలతో హోమం | - బ్రహ్మ వర్చస్సు |
| 15. నేతితో హోమం | - బుద్ధిశక్తి |
| 16. పాలతో హోమం | - మేధాశక్తి |
| 17. నువ్వులు, బియ్యంతో హోమం | - ఐశ్వర్యం, వశీకరణ |

**కామ్యహెూమాన్ని పై తెలిపిన ద్రవ్యాలతో కనీసం 10,000 సార్లు చెయ్యాలి**

# వివిధ హోమకుండ ఫలితాలు

**సర్వసిద్ధికరం కుండం చతురస్రముదాహృతం**
**పుత్రప్రదం యోనికుండం మర్ధేద్వాభం శుభప్రదం ॥**
**శత్రుక్షయకరం త్ర్యస్రం వర్తులం శాంతికర్మణే,**
**ఖేదమారణయోః కుండం షడస్రం పద్మసన్నిభమ్ ॥**
**వృష్టిదం రోగశమనం కుండమష్టాస్రమీరితం।**
**విప్రాణాం చతురస్రంస్యాద్రాజ్ఞాం వర్తులమిష్యతే ॥**
**వైశ్యానామర్ధచంద్రాభాం శూద్రాణాం త్ర్యస్రమీరితం ।**
**చతురస్రంతు సర్వేషాం కేచిదిచ్ఛంతి తాంత్రికాః ॥** (శారదాతిలకం 3వ పటలం)

సుప్రసిద్ధమంత్రశాస్త్రగ్రంథం 'శారదాతిలకం'లో చతురస్ర కుండలంలో హోమం చేస్తే సర్వసిద్ధులు లభిస్తాయని, సంతానం కోసం యోనికుండాన్ని ఉపయోగించాలని, అర్ధచంద్రకుండ సర్వశుభప్రదమని, త్ర్యస్రకుండం శతృనాశనానికి ఉపయోగిస్తుందని, వర్తులాకారం కుండంలో చేసే హోమం శాంతి ప్రదమని, షడస్ర (ఆరుకోణాల) కుండం మారణకర్మల కోసమని, పద్మాకార కుండంలో హోమం సంపదనిస్తుందని, అష్టాస్రకుండం (ఎనిమిదికోణాల) రోగనాశనాన్ని కలిగించి ఆరోగ్యాన్ని ఇస్తుందని చెప్పబడింది.

బ్రాహ్మణవర్ణం వారు చతురస్రకుండాన్ని, క్షత్రియులు వర్తులాకార కుండాన్ని, వైశ్యులు అర్ధచంద్రకుండాన్ని, శూద్రవర్ణంవారు త్ర్యస్రకుండాన్ని ఉపయోగించడం శ్రేయస్కరమని, చతురస్రకుండం అన్నీ వర్ణాలవారికి శుభప్రదమైనదని తెలియజేయడం జరిగింది. కనుక సాధకులు కామ్యహోమాన్ని ఆచరించేటప్పుడు మీకున్న కామ్యాన్ని అనుసరించి, దానికి తగిన హోమకుండాన్ని ఏర్పరుచుకొని అందులో హోమాన్ని చేస్తే అభీష్ఠఫలాన్ని పొందగలరు.



## హోమద్రవ్య పరిమాణం (శారదా తిలకం)

**అధాత్ర హోమ ద్రవ్యాణాం ప్రమాణ మభి ధీయతే**
**కర్షమాత్రం ఘృతం హోమే శుక్తి మాత్రం పయః స్మృతం.......** *(పంచమపటలం)*

నూనె, నెయ్యితో హోమం చేసేటప్పుడు ఒక 'కర్ష' ప్రమాణంలో వేయాలి. పాలు 1 శుక్తి ప్రమాణంలో హోమంచేయాలి. పంచగవ్యాలని కూడా 1 శుక్తి ప్రమాణంతోనే హోమంలో సమర్పించాలి. పెరుగు-2 పలాల చొప్పున వేయాలి. పేలాలు ఒక ముష్టి (గుప్పెడు) సత్తుపిండి కూడా గుప్పెడు చొప్పున సమర్పించాలి. బెల్లం, చక్కెర అర్ధపలం చొప్పున హోమంచేయాలి.

పత్రాలు, పుష్పాలు, అప్పాలు, జంతికలు వంటి భక్ష్యాలు ఒక్కొక్కటిగానే వేయాలి. తుంచి వేయకూడదు. అలాగే అరటిపండు, నారింజ వంటి పళ్ళు ఒక్కొక్కటిగానే వేయాలి. ముక్కలు వేయకూడదు. పనసపండు తొనలు వేయకూడదు. ఆ పండును పది ముక్కలుగా చేసి ఒక్కో భాగాన్ని హోమం చేయాలి. అదే విధంగా కొబ్బరికాయను కూడా ఎనిమిది ముక్కలు చేసి ఒక్కోముక్కతో హోమం చేయాలి. దోసకాయ, వెలగపండు, మారేడుకాయను హోమం చేసేటప్పుడు ఆ కాయను 3 ముక్కలుగా చేసి వేయాలి. అలాగే ఇతర ఫలాలను కూడా 3 ముక్కలు చేసి వాటితో హోమం చేయాలి.

హోమం చేసే సమిధలు పది అంగుళాల పొడవు వుండాలి. దూర్వలు (గరిక) కనీసం 3 అంగుళాల పొడవు వుండాలి. తిప్పతీగ నాలుగు అంగుళాల పొడవు వుండాలి. కందులు, మినుములు, పెసలు, గోధుమలు, యవలు, జొన్న, సజ్జలు, రాగులు వంటి తృణధాన్యాలను ముష్టి (గుప్పెడు) ప్రమాణంలో హవనం చేయాలి. బియ్యం అర్ధ గుప్పెడు, తిలలు (నువ్వులు) ఆవాలు ఒక చులుకం (అరచేతి మధ్య గుంటలో పట్టినంత) గ్రహించి హోమం చేయాలి. ఉప్పు 1 కర్షం ప్రమాణంలో గ్రహించాలి. మిరియాలు 21 తీసుకుని (ఒక ఆహుతికి) సమర్పించాలి. గుగ్గిలం, ఇంగువ, చందనం, అగరు, కర్పూరం, కస్తూరి, కుంకుమపువ్వు, చింతగింజలు 2 శోణాల పరిమాణంలో గ్రహించి హోమం చేయాలి.

**హోమం చేసేడప్పుడు అందులో వేసే ద్రవ్యాలను**
**బొటనవ్రేలు, మధ్యవ్రేలు, ఉంగరం వ్రేలుతో కలిపి పట్టుకుంటే ఎంతో వస్తుందో**
**అంతే ప్రమాణంతో హోమం చేయటం ఆచారం.**

# హోమకుండంలో అగ్ని విశేషాలు

## (శారదా తిలకం-పంచమపటలం)

1. సాధకుడు సమిధలతో హోమాన్ని చేసేటప్పుడు అగ్నిహోత్రుణ్ణి నిలబడి ఉన్నట్టుగా ధ్యానించాలి. కేవలం నేయితో హోమం చేస్తున్నపుడు అగ్నిని పడుకున్నట్టుగా భావిస్తూ, ఇతర ద్రవ్యాలతో హోమం చేసేటప్పుడు అగ్నిని కూర్చున్నట్టుగా భావిస్తూ హోమం చేయాలి.
2. పొగతో నిండిపోయిన అగ్నిని శిరస్సు అంటారు. పొగలేని అగ్నిని చక్షువు (కన్ను) అంటారు. నల్లగా జ్వలించే అగ్నిని కర్ణం (చెవి) అంటారు. కేవలం కాష్ఠమాత్రంగా వెలుగుతున్న అగ్నిని నాసిక అంటారు. హోమం చేసే సాధకుడు చక్కగా జ్వలిస్తున్న జిహ్వ అనే అగ్నిలో మాత్రమే హోమం చేయాలి. అగ్ని కర్ణ స్థానంలో అనగా నల్లగా జ్వలిస్తున్నప్పుడు హోమం చేస్తే వ్యాధి కలుగుతుంది. నేత్ర స్థానంలో అనగా ఏ మాత్రం పొగ లేకుండా వున్న అగ్నిలో హోమం చేస్తే మనోవ్యాధి కలుగుతుంది. అగ్ని తల స్థానంలో ఉన్నప్పుడు అనగా పూర్తిగా పొగతో నిండిపోయినపుడు హోమం చేస్తే దరిద్రం, ధననష్టం చేసినవాడికి కలుగుతాయి.
3. హోమగుండంలో వున్న అగ్ని సిందూరం, బంగారం ఉదయించే సూర్యుడు కుంకుమపువ్వు, తేనె రంగులలో వుండాలి. వీటిలో బంగారు రంగు శ్రేష్ఠం.
4. హోమం చేస్తున్నప్పుడు హోమకుండం నుంచి భేరీ, మేఘ గర్జన, ఏనుగు ఘీంకారం లాంటి శబ్దాలు వస్తే మంచిది. అలాగే కుండం నుంచి నాగ, సంపెంగ, మల్లి, జాజి, పాటల, కలువ, నెయ్యి, గుగ్గిలం, గంధంలాంటి సువాసనలు రావాలి.
5. హోమం చేస్తున్నప్పుడు కుండంలో అగ్ని జ్వాల గొడుగులాగా కుడివైపుకి తిరుగుతుంటే యజమానికి శుభం జరుగుతుంది. అలాగే అగ్ని నుంచి వెలువడే ధూమం (పొగ) తెల్లగా లేక ఎర్రగా వుంటే మరింత శుభప్రదం.
6. హోమగుండం నుంచి దుర్గంధం వస్తే హోమం చేసేవాడికి దుఃఖం కలుగుతుంది. అగ్నిశిఖలు చిందరవందరగా ఏర్పడితే యజమానికి మరణం లేదా రోగం లేదా ధన నష్టం జరుగుతాయి. హోమకుండం నుంచి వచ్చే పొగ ఆకుపచ్చరంగు లేక పావురం రంగులో వుంటే పశునష్టం జరుగుతుంది. హోమం చేస్తున్నప్పుడు ఈ విధమైన దోషాలు కనబడితే సాధకుడు మూలమంత్రాన్ని పఠించి దోష పరిహారార్థం అని సంకల్పం చెప్పి 25 ఆహుతుల్ని ఆజ్యంతో సమర్పించాలి.

# శ్రీ భైరవ మంత్ర భేదాలు

## 1) శ్రీ మహాకాలభైరవ మంత్రం

**ఓం నమోభగవతే మహాకాలభైరవాయ కాలాగ్ని తేజసే అముకం మే శత్రుం మారయ మారయ పోథయ పోథయ హుం ఫట్**

ఓం అస్య శ్రీ మహాకాలభైరవ మంత్రస్య, భైరవ ఋషిః విరాట్ ఛందః, శ్రీ మహాకాలభైరవోదేవతా, హూం బీజం, హ్రీం శక్తిః, స్వాహా కీలకం, శ్రీమహాకాలభైరవ ప్రీత్యర్థం జపే వినియోగః।

| **కరన్యాసం** | **హృదయన్యాసం** |
|---|---|
| ఓం హ్రాం అంగుష్ఠాభ్యాం నమః | హ్రాం హృదయాయ నమః |
| ఓం హ్రీం తర్జనీభ్యాం నమః | హ్రీం శిరసేస్వాహా |
| ఓం హ్రూం మధ్యమాభ్యాం నమః | హ్రూం శిఖాయైవషట్ |
| ఓం హ్రైం అనామికాభ్యాం నమః | హ్రైం కవచాయ హుం |
| ఓం హ్రౌం కనిష్ఠికాభ్యాం నమః | హ్రౌం నేత్రత్రయాయౌషట్ |
| ఓం హ్రః కరతలకరపృష్ఠాభ్యాం నమః | హ్రః అస్త్రాయ ఫట్ |

**భూర్భువస్సువరోమితి దిగ్బంధః**

**ధ్యానం :** కోటికాలానలాభాసం చతుర్భుజం త్రిలోచనమ్ ।
శ్మశానాష్టక మధ్యస్థం ముండాష్టక విభూషితమ్ ॥
పంచప్రేతస్థితందేవం త్రిశూలం డమరూం తధా ।
ఖడ్గ చ ఖర్పూరం చైవ వామ దక్షిణ యోగతః ॥
విభ్రమం సుందరం దేహం శ్మశానభస్మ భూషితమ్ ।
నానాశవై క్రీడమానం కాళికాహృదయ స్థితమ్ ॥
లాలయంతం రతాసక్తం ఘోరచుంబన తత్పరమ్ ।
గృధగోమాయు సంయుక్తం ఫేరవీగణ సంయుతమ్ ॥
జటాపటల శోభాఢ్యం సర్వశూన్యాలయస్థితమ్ ।
సర్వశూన్యం ముండభూషం ప్రసన్నవదనం శివం ॥

**పురశ్చరణ :** పై మంత్రాన్ని లక్షసార్లు జపించాలి.

## ౨) స్వర్ణాకర్షణ భైరవమంత్రం (మంత్రమహార్ణవం)

**ఐం హ్రీం శ్రీం ఆపదుద్ధారణాయ హ్రాం హ్రీం హూం**
**అజామలబద్ధాయ లోకేశ్వరాయ స్వర్ణాకర్షణ భైరవాయ**
**మమదారిద్ర్య విద్వేషణాయ మహాభైరవాయ నమః శ్రీం హ్రీం ఐం**

ఓం బ్రహ్మర్షయేనమః శిరసి। పంక్తిఛందసే నమః ముఖే। స్వర్ణాకర్షణ భైరవదేవతాయై నమః హృది। హ్రీం బీజాయ నమః గుహ్యే। హ్రీం శక్తయే నమః పాదయోః । ఓం కీలకాయ నమః సర్వాంగే।

| | **కరన్యాసం** | **హృదయన్యాసం** |
|---|---|---|
| ఐం హ్రీం శ్రీం ఆపదుద్ధరణాయ | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయ నమః |
| హ్రాం హ్రీం హూం అజామలబద్ధాయ | తర్జనీభ్యాం నమః | శిరసే స్వాహా |
| లోకేశ్వరాయ | మధ్యమాభ్యాం నమః | శిఖాయై వషట్ |
| స్వర్ణాకర్షణ భైరవాయ | అనామికాభ్యాం నమః | కవచాయ హుం |
| మమదారిద్ర్య విద్వేషణాయ | కనిష్ఠికాభ్యాం నమః | నేత్రత్రయాయౌషట్ |
| మహాభైరవాయ నమః శ్రీంహ్రీం ఐం | కరతలకరపృష్ఠాభ్యాం నమః | అస్త్రాయ ఫట్ |

**భూర్భువస్సువరోమితి దిగ్బంధః**

**ధ్యానం :** **పీతవర్ణం చతుర్బాహుం త్రినేత్రం పీతవాససం ।**
**అక్షయ స్వర్ణమాణిక్యం తడిత్పూరిత పాత్రకమ్ ।**
**అభిలషితం మహాశూలం తోమరం చామర ద్వయమ్ ।**
**స్వర్ణాభరణ సంపన్నం ముక్తాహారోప శోభితమ్ ॥**

**పురశ్చరణ :**

ఈ మంత్రాన్ని లక్షసార్లు జపించాలి. దశాంశహోమాన్ని నువ్వులు పాయసంతో చేయాలి. తరువాత తర్పణాది పురశ్చరణాంగాలన్నీ యథావిధిగా ఆచరించాలి. ఇలా చేస్తే మంత్రం సిద్ధిస్తుంది.

**కామ్యప్రయోగాలు :**

★ మంత్రం సిద్ధిపొందిన సాధకుడు పదివేలసార్లు ఈ మంత్రాన్ని జపిస్తే దారిద్ర్య బాధల నుంచి విముక్తి పొంది ఐశ్వర్యవంతుడవుతాడు.

★ కరవీర పుష్పాలతో, జాజిపూలతో హోమంచేస్తే సకల శుభఫలితాలు కలుగుతాయి.

★ ఆవునేతితో హోమం చేస్తే ఐహికాముష్మిక ఫలాలు లభిస్తాయి.

(గమనిక : కామ్యహోమాలని కనీసం 10వేల సార్లు చేయాలి)



## శ్రీ వటుకభైరవ సహస్రనామ స్తోత్రం

ఓం అస్యశ్రీ వటుక భైరవ సహస్రనామ స్తోత్రస్య దుర్వాసా ఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీ వటుక భైరవోదేవతా, మమ సర్వ కార్యసిద్ధ్యర్థే, సర్వశత్రు నివారణార్థే పాఠే వినియోగః ॥

**ఓం నమో భైరవరూపాయ భైరవాయ నమో నమః ।**
**నమో భద్రస్వరూపాయ జగదాద్య నమో నమః ॥**

**నమః కల్పస్వరూపాయ వికల్పాయ నమో నమః ।**
**నమః శుద్ధ స్వరూపాయ సుప్రకాశాయ తే నమః ॥**

**నమః కంకాళరూపాయ కాలరూపిన్ నమోస్తుతే ।**
**నమస్త్ర్యంబక రూపాయ కాలరూప నమోస్తుతే ॥**

**నమః సంసారసారాయ శారదాయ నమో నమః ।**
**నమో భైరవరూపాయ భైరవాయ నమో నమః ॥**

**నమః క్షేత్ర నివాసాయ క్షేత్రపాలాయ తే నమః ।**
**క్షేత్ర క్షేత్ర స్వరూపాయ క్షేత్ర కర్త్రే నమో నమః ॥**

**నమో నాగవిలాసాయ భైరవాయ నమో నమః ।**
**నమో మాతంగ రూపాయ భావరూపిన్ నమోస్తుతే ॥**

**నమః సిద్ధి స్వరూపాయ సిద్ధిదాయ నమో నమః ।**
**నమో బిందు స్వరూపాయ బిందు సింధు ప్రకాశినే ॥**

**నమో మంగళరూపాయ ధర్మదాయ నమో నమః ।**
**నమో సంకష్ట నాశాయ శంకరాయ నమో నమః ॥**

**నమో ధర్మస్వరూపాయ ధర్మదాయ నమో నమః ।**
**నమోఽనంత స్వరూపాయ ఏకరూప నమోస్తుతే ॥**

**నమో మోహన రూపాయ మోక్షరూపాయ తే నమః ।**
**నమో జలదరూపాయ శ్యామరూప నమోస్తుతే ॥** **10**

నమః స్థూల స్వరూపాయ శుద్ధరూపాయ తే నమః ।
నమో నీలస్వరూపాయ రంగ రూపాయ తే నమః ॥

నమో మండలరూపాయ మండలాయ నమో నమః ।
నమో రుద్ర స్వరూపాయ మండలాయ నమో నమః ॥

నమో బ్రహ్మ స్వరూపాయ బ్రహ్మహన్త్రే నమో నమః ।
నమస్త్రి శూలధరాయ ధరాధారిన్నమోస్తుతే ॥

నమస్సంసారబీజాయ విరూపాయ నమోనమః ।
నమో విమలరూపాయ భైరవాయ నమో నమః ॥

నమో జంగమరూపాయ జలజాయ నమో నమః ।
నమో కాలస్వరూపాయ కాలరుద్రాయ తే నమః ॥

నమో భైరవరూపాయ భైరవాయ నమో నమః ।
నమశ్శత్రు వినాశాయ భీషణాయ నమో నమః ॥

నమశ్శాంతాయ దాంతాయ భ్రమరూప నమోస్తుతే ।
న్యాయగమ్యాయ శుద్ధాయ యోగిధ్యాయాయ తే నమః ॥

నమః కమలకాంతాయ కాలవృద్ధాయ తే నమః ।
నమో జ్యోతిస్వరూపాయ సుప్రకాశాయ తే నమః ॥

నమః కల్పస్వరూపాయ భైరవాయ నమో నమః ।
నమో జయస్వరూపాయ జగజ్జాడ్యనివారిణే ॥

మహాభూతాయ భూతాయ భూతానాం పతయే నమః ।
నమో నందాయ వందాయ వందినే బ్రహ్మవాదినే ॥

నమో వాదస్వరూపాయ న్యాయగమ్యాయ తే నమః ।
నమో భావస్వరూపాయ మాయా నిర్మాణ రూపిణే ॥

విశ్వవంద్యాయ వంద్యాయ నమో విశ్వంభరాయ తే ।
నమో నేత్రస్వరూపాయ నేత్ర రూపిన్నమోస్తుతే ॥ 22

నమో వరుణరూపాయ భైరవాయ నమో నమః ।
నమో యమస్వరూపాయ వృద్ధరూపాయ తే నమః ॥
నమో కుబేరరూపాయ కాలనాథాయ తే నమః ।
నమ ఈశానరూపాయ అగ్నిరూపాయ తే నమః ॥
నమో వాయు స్వరూపాయ విశ్వరూపాయ తే నమః ।
నమః ప్రాణస్వరూపాయ ప్రాణాధిపతయే నమః ॥
నమః సంహారరూపాయ పాలనాయ నమో నమః ।
నమశ్చంద్రస్వరూపాయ చండరూపాయ తే నమః ॥
నమో మందరవాసాయ వాసినే సర్వయోగినామ్ ।
యోగిగమ్యాయ యోగ్యాయ యోగినాం పతయే నమః ॥
నమో జంగమవాసాయ వామదేవాయ తే నమః ।
నమః శత్రు వినాశాయ నీలకంఠాయ తే నమః ॥
నమో భక్తివినోదాయ దుర్భగాయ నమో నమః ।
నమో మాన్యస్వరూపాయ మానదాయ నమో నమః ॥
నమో భక్తి విభవాయ భవితాయ నమో నమః ।
నమో రజస్వరూపాయ సాత్వికాయ నమో నమః ॥
నమస్తామసరూపాయ తారణాయ నమః ।
నమో గంగావినోదాయ జటాసంధారిణే నమః ॥
నమో భైరవ రూపాయ భీషణాయ నమో నమః ।
సంగ్రామ సార రూపాయ సంగ్రామజయదాయినే ॥
మనస్సంగ్రామ రూపాయ యవనాయ నమో నమః ।
నమో వృద్ధి స్వరూపాయ వృద్ధి దాయ నమో నమః ॥
నమస్త్రి శూల హస్తాయ శూలసంహారిణే నమః ।
నమో ద్వంద్వస్వరూపాయ రూపదాయ నమో నమః ॥ 34

నమోః శత్రువినాశాయ శత్రుబుద్ధివినాశినే ।
మహాకాలాయ కాలయ కాలనాథాయ తే నమః ॥

నమో భైరవ రూపాయ భైరవాయ నమో నమః ।
నమశ్శంభుస్వరూపాయ శంభురూపిన్ నమోస్తుతే ॥

నమః కమలహస్తాయ డమరు భ్రాజినే నమః ।
నమః కుక్కుర వాహాయ వహనాయ నమో నమః ॥

నమో విమలనేత్రాయ త్రినేత్రాయ నమో నమః ।
నమః సంసార రూపాయ సారమేయ సువాహినే ॥

నమో జ్ఞానస్వరూపాయ జ్ఞానవాథాయ తే నమః ।
నమో మంగళరూపాయ మంగళాయ నమో నమః ॥

నమో న్యాయవిశాలాయ మంత్ర రూపాయతే నమః ।
నమో యన్త్ర స్వరూపాయ యన్త్రధారిన్నమోస్తుతే ॥

నమో భైరవరూపాయ భైరవాయ నమో నమః ।
నమః కళంకరూపాయ కళంకాయ నమో నమః ॥

నమః సంసారపారాయ భైరవాయ నమో నమః ।
రుండమాలా విభూషాయ భీషణాయ నమోనమః ॥

నమో దుఃఖ నివారాయ విపారాయ నమో నమః ।
నమో దండస్వరూపాయ క్షణరూపాయ తే నమః ॥

నమో ముహూర్తరూపాయ విహారాయ నమో నమః ।
నమో మోదస్వరూపాయ శ్రోణ రూపాయ తే నమః ॥

నమో నక్షత్ర రూపాయ క్షేత్రరూపాయ తే నమః ।
నమో విష్ణురూపాయ బిందురూపాయ తే నమః ॥

నమో బ్రహ్మస్వరూపాయ బ్రహ్మచారిన్నమోస్తుతే ।
నమో కన్థానివాసాయ వటవాసాయ తే నమః ॥ 46

నమో జ్వలనరూపాయ జ్వలనాథ నమో నమః ।
నమో వటుకరూపాయ ధూర్తరూపాయ తే నమః ॥

నమో భైరవరూపాయ భైరవాయ నమో నమః ।
నమో వైద్య స్వరూపాయ వైద్య రూపిన్నమోస్తుతే ॥

నమ ఔషధరూపాయ ఔషధాయ నమో నమః ।
నమో వ్యాధినివారాయ వ్యాధిరూపి న్నమోనమః ॥

నమో జ్వరనివారాయ జ్వరరూపాయ తే నమః ।
నమో రుద్రస్వరూపాయ రుద్రాణాం పతయే నమః ॥

విరూపాక్షాయ దేవాయ భైరవాయ నమో నమః ।
నమో గ్రహస్వరూపాయ గ్రహాణాం పతయే నమః ॥

నమః పవిత్రధారాయ పరశుధారాయ తే నమః ।
యజ్ఞోపవీతదేవాయ దేవ దేవ నమోస్తుతే ॥

నమో యజ్ఞస్వరూపాయ యజ్ఞానాం ఫలదాయినే ।
నమో రణప్రతాపాయ తాపనాయ నమో నమః ॥

నమో గణేశరూపాయ గణరూపాయ తే నమః ।
నమో రశ్మిస్వరూపాయ రశ్మిరూపాయ తే నమః ॥

నమో మలయరూపాయ మలయాయ నమో నమః ।
నమో విభక్తిరూపాయ విమలాయ నమో నమః ॥

నమో మధురరూపాయ మధిపూర్ణకలాపినే ।
కాలేశ్వరాయకాలాయ కాలనాథాయ తే నమః ॥

నమో విశ్వప్రకాశాయ భైరవాయ నమో నమః ।
నమో యోనిస్వరూపాయ భ్రాతృరూపాయతే నమః ॥

నమో భగస్వరూపాయ భైరవాయ నమో నమః ।
నమో వృషస్వరూపాయ కర్మరూపాయ తే నమః ॥ 58

నమో వేదాంత వేద్యాయ వేద సిద్ధాంత సారిణే ।
నమశ్శాకా ప్రకాశాయ పురుషాయ నమో నమః ॥

నమః ప్రకృతిరూపాయ భైరవాయ నమో నమః ।
నమో విశ్వస్వరూపాయ శివరూపాయ తే నమః ॥

నమో జ్యోతిస్వరూపాయ నిర్గుణాయ నమో నమః ।
నిరంజనాయ శాంతాయ నిర్వికారాయ తే నమః ॥

నిర్మమాయ విమోహాయ విశ్వనాథాయ తే నమః ।
నమః కంఠప్రకాశాయ శత్రునాశయ తే నమః ॥

నమ ఆశా ప్రకాశాయ ఆశాపూర్ణ కృతే నమః ।
నమో మత్స్యస్వరూపాయ యోగరూపాయ తే నమః ॥

నమో వారాహరూపాయ వామనాయ నమో నమః ।
నమ ఆనందరూపాయ జ్వలత్కేశాయ తే నమః ॥

నమో అనర్ఘకేశాయ ఆనన్దాయ నమో నమః ।
నమః పాప విమోక్షాయ విమోక్షాయ నమో నమః ॥

నమః కైలాస నాథాయ కాలనాథాయ తే నమః ।
నమో బిందుదబిందాయ బిందుభాయ నమో నమః ॥

నమః ప్రణవరూపాయ భైరవాయ నమో నమః ।
నమో మేరు నివాసాయ భక్తవాసాయ తే నమః ॥

నమో మేరు స్వరూపాయ భైరవాయ నమో నమః ।
నమో భద్రస్వరూపాయ భద్రరూపాయ తే నమః ॥

నమో యోగిస్వరూపాయ యోగ రూపాయ తే నమః ।
నమో మైత్రీ స్వరూపాయ మిత్రరూపాయ తే నమః ॥

నమో బ్రహ్మనివాసాయ కాశీనాథాయ తే నమః ।
నమో బ్రహ్మాండవాసాయ బ్రహ్మావాసాయ తే నమః ॥ 70

నమో మాతంగవాసాయ సూక్ష్మవాసాయ తే నమః ।
నమో మాతృనివాసాయ భ్రాతృవాసాయ తే నమః ॥

నమో జగన్నివాసాయ జలావాసాయ తే నమః ।
నమః కౌల నివాసాయ నేత్రవాసాయ తే నమః ॥

నమో భైరవ వాసాయ భైరవాయ నమో నమః ।
నమస్సముద్ర వాసాయ వహ్నివాసాయ తే నమః ॥

నమశ్చన్ద్రనివాసాయ చంద్రవాసాయ తే నమః ।
నమః కళింగవాసాయ కళింగాయ నమో నమః ॥

నమ ఉత్కళవాసాయ మహేన్ద్రస్థాయ తే నమః ।
నమః కర్పూరవాసాయ సిద్ధివాసాయ తే నమః ॥

నమః సుందర వాసాయ భైరవాయ నమో నమః ।
నమః ఆకాశవాసాయ వాసినే సర్వయోగినామ్ ॥

నమో బ్రాహ్మణవాసాయ శూద్రవాసాయ తే నమః ।
నమః క్షత్రియ వాసాయ వైశ్యవాసాయ తే నమః ॥

నమః పక్షినివాసాయ భైరవాయ నమో నమః ।
నమః పాతాళ మూలాయ మూలవాసాయ తే నమః ॥

నమో రసాతలస్థాయ సర్వపాతాలవాసినే ।
నమః కంకాల వాసాయ కంకవాసాయతే నమః ॥

నమో మంత్ర నివాసాయ భైరవాయ నమో నమః ।
నమో హంకార రూపాయ రజోరూపాయ తే నమః ॥

నమః సత్త్వ నివాసాయ భైరవాయ నమో నమః ।
నమో నలినరూపాయ నలినాంగ ప్రకాశినే ॥

నమః సూర్యస్వరూపాయ భైరవాయ నమో నమః ।
పంచయోని ప్రకాశాయ చతుర్యోని ప్రకాశినే ॥ 82

నవయోని ప్రకాశాయ భైరవాయ నమో నమః ।
నమః షోడశరూపాయ నమః షోడశధారిణే ॥

చతుః షష్టి ప్రకాశాయ భైరవాయ నమో నమః ।
నమో బిందు ప్రకాశాయ సుప్రకాశాయ తే నమః ॥

నమో గణస్వరూపాయ సుఖరూప నమోస్తుతే ।
నమోఽంబర స్వరూపాయ భైరవాయ నమో నమః ॥

నమో నానా స్వరూపాయ సుఖరూప నమోస్తుతే ।
నమో దుర్గా స్వరూపాయ దుఃఖహంత్రే నమోస్తుతే ॥

నమో విశుద్ధదేహాయ దివ్యదేహాయ తే నమః ।
నమో భైరవ రూపాయ భైరవాయ నమో నమః ॥

నమః ప్రేత నివాసాయ పిశాచాయ నమో నమః ।
నమో నిశా ప్రకాశాయ నిశారూప నమోస్తుతే ॥

నమస్సోమార్ధ రామాయ ధరాధీశాయ తే నమః ।
నమః సంసార భారాయ భారకాయ నమో నమః ॥

నమో దేహ స్వరూపాయ అదేహాయ నమో నమః ।
దేవదేహాయ దేవాయ భైరవాయ నమో నమః ॥

విశ్వేశ్వరాయ విశ్వాయ విశ్వధారిన్నమోస్తుతే ।
స్వప్రకాశ ప్రకాశాయ భైరవాయ నమో నమః ॥

స్థితిరూపాయ స్థిత్యాయ స్థితీనాం పతయే నమః ।
సుస్థిరాయ సుకేశాయ కేశవాయ నమో నమః ॥

స్థవిష్ఠాయ గరిష్ఠాయ ప్రేష్ఠాయ పరమాత్మనే ।
నమో భైరవరూపాయ భైరవాయ నమో నమః ॥

నమో పారదరూపాయ పవిత్రాయ నమో నమః ।
నమో వేధకరూపాయ అనింద్యాయ నమో నమః ॥ 94

నమ శ్శబ్దస్వరూపాయ శబ్దాతీతాయ తే నమః ।
నమో భైరవ రూపాయ భైరవాయ నమో నమః ॥

నమో నిందాస్వరూపాయ అనిందాయ నమో నమః ।
నమో విశ్వస్వరూపాయ భైరవాయ నమో నమః ॥

నమో శరణ్య శరణ శరణ్యానా సుఖాయతే ।
నమః శరణ్యరక్షాయ భైరవాయ నమో నమః ॥

నమః స్వాహాస్వరూపాయ స్వధారూపాయ తే నమః ।
నమో వౌషట్ స్వరూపాయ భైరవాయ నమో నమః ॥

అక్షరాయ నమస్తుభ్యం త్రిధా మాత్రా స్వరూపిణే ।
నమోక్షరాయ శుద్ధాయ భైరవాయ నమో నమః ॥

అర్ధమాత్రాయ పూర్ణాయ పరిపూర్ణాయ తే నమః ।
నమో భైరవరూపాయ భైరవాయ నమో నమః ॥

నమోఽష్ట చక్రరూపాయ బ్రహ్మరూపాయ తేఽనమః ।
నమోభైరవ రూపాయ, భైరవాయ నమో నమః ॥

నమో సృష్టిస్వరూపాయ సృష్టికర్త్రే మహాత్మనే ।
నమః పాల్యస్వరూపాయ భైరవాయ నమో నమః ॥

సనాతనాయ నిత్యాయ నిర్గుణాయ గుణాయ తే ।
నమః సిద్ధాయ శాంతాయ భైరవాయ నమో నమః ॥

నమో ధారాస్వరూపాయ ఖడ్గహస్తాయతే నమః ।
నమస్త్రిశూలహస్తాయ భైరవాయ నమో నమః ॥

నమః కుండల వర్ణాయ శవముండ విభూషిణే నమః ।
మహాక్రుద్ధాయ చండాయ భైరవాయ నమో నమః ॥

నమో వాసుకి భూషాయ సర్వభూషాయతే నమః ।
నమః కపాలహస్తాయ భైరవాయ నమో నమః ॥ 106

పానపాత్రే ప్రమత్తాయ మత్తరూపాయ తే నమః ।
నమో భైరవరూపాయ భైరవాయ నమో నమః ॥

మధ్యమకారప్రియాయ మాధవాయ నమో నమః ।
నమః కుమారరూపాయ స్త్రీశూర్పాయ నమో నమః ॥

నమో గంధ స్వరూపాయ భైరవాయ నమో నమః ।
నమో దుర్గంధరూపాయ సుగంధాయ నమో నమః ॥

నమః పురుష రూపాయ పుష్పభాషణ తే నమః ।
నమః పుష్ప ప్రకాశాయ భైరవాయ నమో నమః ॥

నమః పుష్ప వినోదాయ పుష్పపూజాయతే నమః ।
నమో భక్తినివాసాయ భక్తదుఃఖ నివారిణే ॥

భక్తప్రియాయ శాంతాయ భైరవాయ నమో నమః ।
నమో భక్తస్వరూపాయ రూపదాయ నమో నమః ॥

నమో భైరవరూపాయ భైరవాయ నమో నమః ।
నమో వాసాయ భద్రాయ వీరభద్రాయ తే నమః ॥

నమః సంగ్రామ సారాయ భైరవాయ నమో నమః ।
నమః ఖట్వాంగహస్తాయ కాలహస్తాయ తే నమః ॥

నమోఽఘోరాయ ఘోరాయ ఘోరాఘోర స్వరూపిణే ।
ఘోరఘుర్మణ్య ఘోరాయ భైరవాయ నమో నమః ॥

ఘోరత్రిశూల హస్తాయ ఘోరవాసాయ తే నమః ।
ఘోరాయ నీలరూపాయ భైరవాయ నమో నమః ॥

ఘోర వాహనగమ్యాయ అగమ్యాయ నమో నమః ।
ఘోర బ్రహ్మస్వరూపాయ భైరవాయ నమో నమః ॥

ఘోర శబ్దాయ ఘోరాయ ఘోరదేహాయ తే నమః ।
ఘోర ద్రవ్యాయ ఘోరాయ భైరవాయ నమో నమః ॥ 118

ఘోరసంగాయ సింహాయ నరసింహాయ తే నమః ।
నమః ప్రచండ సింహాయ సింహరూపాయ తే నమః ॥

నమః సింహ ప్రకాశాయ సుప్రకాశాయ తే నమః ।
నమో విజయరూపాయ జగదాద్య నమో నమః ॥

నమో భార్గవరూపాయ భర్గరూపాయ తే నమః ।
నమో భైరవరూపాయ భైరవాయ నమో నమః ॥

నమో మేధ్యాయ శుద్ధాయ మాయాధీశాయ తే నమః ।
నమో మేఘప్రకాశాయ భైరవాయ నమో నమః ॥

దుర్జ్ఞేయాయ దుస్తరాయ దుర్లభాయ దురాత్మనే ।
భక్తిలభ్యాయ భవ్యాయ భావితాయ నమో నమః ॥

నమో గౌరవరూపాయ గౌరవాయ నమో నమః ।
నమో భైరవరూపాయ భైరవాయ నమోనమః ॥

నమో విఘ్న నివారాయ విఘ్ననాశిన్నమోస్తుతే ।
విఘ్నానాం విద్రావణాయ భైరవాయ నమో నమః ॥

నమః కింశుకరూపాయ రజోరూపాయ తే నమః ।
నమో నీలస్వరూపాయ భైరవాయ నమో నమః ॥

నమో గణస్వరూపాయ భైరవాయ నమో నమః ॥
నమో విశ్వప్రకాశాయ భైరవాయ నమో నమః ॥

నమో యోగిప్రకాశాయ యోగిగమ్యాయ తే నమః ।
నమో హేరంబ రూపాయ భైరవాయ నమో నమః ॥

నమస్త్రిధార రూపాయ రూపదాయ నమో నమః ।
నమః స్వరస్వరూపాయ భైరవాయ నమో నమః ॥

నమస్సరస్వతీ రూప బుద్ధిరూప నమో నమః ।
నమో వంద్యస్వరూపాయ భైరవాయ నమో నమః ॥ 130

నమస్త్రివిక్రమ రూప త్రిస్వరూపాయతే నమః ।
నమశ్శశాంకరూపాయ భైరవాయ నమో నమః ॥

నమో వ్యాపకరూపాయ వ్యాధరూపాయతే నమః ।
నమో భైరవరూపాయ భైరవాయ నమో నమః ॥

నమో విశదరూపాయ భైరవాయ నమో నమః ।
నమః సత్త్వస్వరూపాయ భైరవాయ నమో నమః ॥

నమస్సాక్షిస్వరూపాయ శివదాయ నమో నమః ।
నమో గంగాస్వరూపాయ యమునారూపిణే నమః ॥

నమో గౌరీస్వరూపాయ భైరవాయ నమో నమః ।
నమో దుఃఖవినాశాయ దుఃఖమోక్షణరూపిణే ॥

మహాచలాయ వైద్యాయ భైరవాయ నమో నమః ।
నమో నన్దిస్వరూపాయ భైరవాయ నమో నమః ॥

నమః నాగస్వరూపాయ స్థితరూపాయ తే నమః ।
నమః కేళిస్వరూపాయ భైరవాయ నమో నమః ॥

నమః క్షేత్రనివాసాయ వాసినే బ్రహ్మవాదినే ।
నమ శ్శాంతాయ శుద్ధాయ భైరవాయ నమో నమః ॥

నమో నర్మదారూపాయ జలరూపాయ తే నమః ।
నమో విశ్వవినోదాయ జయదాయ నమో నమః ॥

నమో మహేన్ద్ర రూపాయ మహనీయాయ తే నమః ।
నమః సంస్కృతిరూపాయ శరణ్యాయ చ తే నమః ॥

నమస్సిన్ధునివాసాయ బాలకాయ నమో నమః ।
నమః సంసార సారాయ సరసాం పతయే నమః ॥

నమోఽ జరస్వరూపాయ భైరవాయ నమో నమః ।
నమః కారుణ్యరూపాయ భైరవాయ నమో నమః ॥ 142

నమో గోకర్ణరూపాయ బ్రహ్మావృక్షాయ తే నమః ।
నమోస్తు శంఖకర్ణాయ హస్తికర్ణాయ తే నమః ॥

నమో విష్టరకర్ణాయ యజ్ఞకర్ణాయ తే నమః ।
నమ శ్శంబుక కర్ణాయ భైరవాయ నమో నమః ॥

నమో దివ్యసుకర్ణాయ కాలకర్ణాయ తే నమః ।
నమో భయదకర్ణాయ భైరవాయ నమో నమః ॥

నమో ఆకాశకర్ణాయ కాలకర్ణాయ తే నమః ।
నమో దిగ్రూపకర్ణాయ భైరవాయ నమో నమః ॥

నమో విశుద్ధ కర్ణాయ విమలాయ నమో నమః ।
నమః సహస్రకర్ణాయ భైరవాయ నమో నమః ॥

నమో నేత్రప్రకాశాయ సునేత్రాయచతే నమః ।
నమో వరదనేత్రాయ జయనేత్రాయ తే నమః ॥

నమో విమలనేత్రాయ యోగనేత్రాయ తే నమః ।
నమః సహస్రనేత్రాయ భైరవాయ నమో నమః ॥

నమః కళిందరూపాయ కళిందాయ నమో నమః ।
నమో జ్యోతిస్వరూపాయ జ్యోతిషాయ నమో నమః ॥

నమస్తారప్రకాశాయ తారరూపిన్ నమోస్తుతే ।
నమో రశ్మిస్వరూపాయ భైరవాయ నమో నమః ॥

నమ ఆనందరూపాయ జగదానందరూపిణే ।
నమో ద్రవిడరూపాయ భైరవాయ నమో నమః ॥

నమః శంఖ నివాసాయ శంకరాయ నమో నమః ।
నమో ముద్రాప్రకాశాయ భైరవాయ నమో నమః ॥

నమో న్యాసస్వరూపాయ న్యాసరూప నమోస్తుతే ।
నమో బిందు స్వరూపాయ భైరవాయ నమో నమః ॥ 154

నమో విసర్గరూపాయ ప్రణరూపాయ తే నమః ।
నమో మంత్రప్రకాశాయ భైరవాయ నమో నమః ॥

నమో జంబుకరూపాయ జంగమాయ నమో నమః ।
నమో గరుడరూపాయ భైరవాయ నమో నమః ॥

నమో లంబుకరూపాయ లంబికాయ నమో నమః ।
నమో లక్ష్మీస్వరూపాయ భైరవాయ నమో నమః ॥

నమో వీరస్వరూపాయ వీరణాయ నమో నమః ।
నమః ప్రచండరూపాయ భైరవాయ నమో నమః ॥

నమో డమరు రూపాయ డమరుధారిణే నమః ।
నమః కళంకనాశాయ కాలనాథాయ తే నమః ॥

నమో వృద్ధిప్రకాశాయ సిద్ధిదాయ నమో నమః ।
నమః సిద్ధిస్వరూపాయ భైరవాయ నమో నమః ॥

నమో ధర్మప్రకాశాయ ధర్మధ్యేయాయ తే నమః ।
ధర్మాయ ధర్మరాజాయ భైరవాయ నమో నమః ॥

నమో ధర్మాధిపతయే ధర్మధ్యేయాయ తే నమః ।
నమో ధర్మార్త సిద్ధాయ భైరవాయ నమో నమః ॥

నమో విరజరరూపాయ రూపారూప ప్రకాశినే ।
నమో రాజప్రకాశాయ భైరవాయ నమో నమః ॥

నమః ప్రతాపసింహాయ ప్రతాపాయ నమో నమః ।
నమః కోటిప్రతాపాయ భైరవాయ నమో నమః ॥

నమః సహస్రరూపాయ కోటి రూపాయ తే నమః ।
నమః ఆనందరూపాయ భైరవాయ నమో నమః ॥

నమః సంహారబంధాయ బంధకాయ నమో నమః ।
నమో విష్ణుస్వరూపాయ వ్యాపకాయ నమో నమః ॥ 166

నమో మాంగల్యనాథాయ శివనాథాయ తే నమః ।
నమః కాలాయ వ్యాఘ్రాయ వ్యాఘ్రరూప నమోస్తుతే ॥

నమో వ్యాలవిభూషాయ భైరవాయ నమో నమః ।
నమో విద్యాప్రకాశాయ విద్యానాం పతయే నమః ॥

నమో యోగిస్వరూపాయ క్రూరరూపాయ తే నమః ।
నమః సంహారరూపాయ శత్రునాశాయ తే నమః ॥

నమః పాలకరూపాయ భైరవాయ నమో నమః ।
నమః కారుణ్యదేవాయ దేవదేవాయ తే నమః ॥

నమో విశ్వవిలాసాయ భైరవాయ నమో నమః ।
నమో నమః ప్రకాశాయ కాశీవాసిన్నమోస్తుతే ॥

నమో భైరవక్షేత్రాయ క్షేత్రపాలాయ తే నమః ।
నమో భద్రస్వరూపాయ భద్రకాయ నమో నమః ॥

నమో భద్రాధిపతయే భయహన్త్రే నమోస్తుతే ।
నమో మాయా వినోదాయ మాయినే మదరూపిణే ॥

నమో మత్తాయ శాంతాయ భైరవాయ నమో నమః ।
నమో మలయ వాసాయ కైలాసాయ నమో నమః ॥
నమః సంసారసారాయ భైరవాయ నమో నమః ।
నమో మాతృవినోదాయ విమలాయ నమో నమః ॥

నమో యమప్రకాశాయ నియమాయ నమో నమః ।
నమః ప్రాణప్రకాశాయ ధ్యానాధిపతయే నమః ॥

నమః సమాధిరూపాయ నిర్గుణాయ నమో నమః ।
నమో మంత్రప్రకాశాయ మంత్రరూపాయ తే నమః ॥

నమో వృందవినోదాయ వృందకాయ నమో నమః ।
నమో వృహంతిరూపాయ భైరవాయ నమో నమః ॥ 178

నమో మాన్యస్వరూపాయ మానదాయ నమో నమః ।
నమో విశ్వప్రకాశాయ భైరవాయ నమో నమః ॥

నమో నైస్థిరపీతాయ సిద్ధపీతాయ తే నమః ।
నమో మండలపీతాయ త్రక్తపీతాయ తే నమః ॥

నమో యశోదానాథాయ కామనాథాయ తే నమః ।
నమో వినోదనాథాయ సిద్ధినాథాయ తే నమః ॥

నమో నాథాయ నాథాయ జ్ఞానానాథాయ తే నమః ।
నమః శంకర నాథాయ జయనాథాయ తే నమః ॥

నమో ముద్గలనాథాయ నీలనాథాయ తే నమః ।
నమో బాలకనాథాయ ధర్మనాథాయ తే నమః ॥

విశ్వనాథాయ నాథాయ కార్యనాథాయ తే నమః ।
నమో భైరవనాథాయ మహానాథాయ తే నమః ॥

నమో బ్రహ్మసనాథాయ యోగనాథాయ తే నమః ।
నమో విశ్వవిహారాయ విశ్వభారాయ తే నమః ॥

నమో రంగసనాథాయ రంగనాథాయ తే నమః ।
నమో మోక్షసనాథాయ భైరవాయ నమో నమః ॥

నమో గోరక్షనాథాయ గోరక్షాయ నమో నమః ।
నమో మందార నాథాయ నందనాథాయ తే నమః ॥

నమో మంగళనాథాయ చంపానాథాయ తే నమః ।
నమో స్సంతోషనాథాయ భైరవాయ నమో నమః ॥

నమో నిర్ధననాథాయ సుఖనాథాయ తే నమః ।
నమః కారుణ్యనాథాయ భైరవాయ నమో నమః ॥

నమో ద్రవిడనాథాయ దరిద్రనాథాయ నమః ।
నమః సంసార నాథాయ జగన్నాథాయ తే నమః ॥ 190

నమో మాధ్వీకనాథాయ మంత్రినాథాయ తే నమః ।
నమో న్యాస సనాథాయ ధ్యాననాథాయతే నమః ॥

నమో గోకర్ణనాథాయ మహానాథాయ తే నమః ।
నమః శుభ్రసనాథాయ భైరవాయ నమో నమః ॥

నమో విమలనాథాయ మండలపాయ తే నమః ।
నమ స్సరోజనాథాయ సత్యనాథాయ తే నమః ॥

నమో భక్తసనాథాయ భక్తినాథాయ తే నమః ।
నమో మోహననాథాయ వత్సనాథాయ తే నమః ॥

నమో మాతృసనాథాయ విశ్వనాథాయ తే నమః ।
నమో బిందు సనాథాయ జయనాథాయ తే నమః ॥

నమో మంగళనాథాయ ధర్మనాథాయ తే నమః ।
నమో గంగాసనాథాయ భూమినాథాయ తే నమః ॥

నమో ధీరసనాథాయ బిందునాథాయ తే నమః ।
నమో కంచుకినాథాయ శృంగినాథాయ తే నమః ॥

నమః సముద్రనాథాయ గిరినాథాయ తే నమః ।
నమో మాంగల్యనాథాయ కద్రూనాథాయ తే నమః ॥

నమో వేదాన్తనాథాయ శ్రీనాథాయ నమో నమః ।
నమో బ్రహ్మాండ నాథాయ భైరవాయ నమో నమః ॥

నమో గిరీశనాథాయ వామనాథాయతే నమః ।
నమో బీజసనాథాయ భైరవాయ నమో నమః ॥

నమో మందిరనాథాయ మదనాథాయ తే నమః ।
నమో భైరవీనాథాయ భైరవాయ నమో నమః ॥

అంబనాథాయ నాథాయ జంతునాథాయ తే నమః ।
నమః కాళీసనాథాయ భైరవాయ నమో నమః ॥ 202

నమో ముకుంద నాథాయ కుందనాథాయ తే నమః ।
నమో కుండల నాథాయ భైరవాయ నమః ॥

నమోష్టచక్రనాథాయ చక్రనాథాయ తే నమః ।
నమో విభూతి నాథాయ శూలనాథాయ తే నమః ॥

నమో న్యాయసనాథాయ న్యాయనాథాయ తే నమః ।
నమో జంగమనాథాయ దయానాథాయ తే నమః ॥

నమో విశ్వ సనాథాయ జగన్నాథాయ తే నమః ।
నమో కామికనాథాయ భైరవాయ నమో నమః ॥

నమః క్షేత్రసనాథాయ జీవనాథాయ తే నమః ।
నమశ్చైలసనాథాయ చైల నాథాయ తే నమః ॥

నమో మాత్రాసనాథాయ అమాత్రాయ నమో నమః ।
నమో ద్వంద్వసనాథాయ భైరవాయ నమో నమః ॥

నమః శూరసనాథాయ శూరనాథాయతే నమః ।
నమ స్సౌజన్యనాథాయ భైరవాయ నమో నమః ॥

నమో దుష్టసనాథాయ భైరవాయ నమో నమః ।
నమో భయసనాథాయ బింబనాథాయ తే నమః ॥

నమో మాయాసనాథాయ భైరవాయ నమో నమః ।
నమో విటంకనాథాయ భైరవాయ నమో నమః ॥

నమశ్చర్మసనాథాయ ఖడ్గనాథాయ తే నమః ।
నమః శక్తిసనాథాయ ధనుర్నాథాయ తే నమః ॥

నమో వానసనాథాయ శాపనాథాయ తే నమః ।
నమో యంత్రసనాథాయ భైరవాయ నమో నమః ॥

నమో గండూషనాథాయ గండూషాయ నమో నమః ।
నమో డాకినీ నాథాయ భైరవాయ నమో నమః ॥ 214

నమో దంకసనాథాయ దంకనాథాయ తే నమః ।
నమో డామరనాథాయ డామరాయ నమో నమః ॥

నమో మాండవ్యనాథాయ యజ్ఞనాథాయ తే నమః ।
నమో యజుఃసనాథాయ క్రీడానాథాయ తే నమః ॥

నమః సమాసనాథాయ సర్వనాథాయ తే నమః ।
నమః శూన్యాయ నాథాయ స్వర్గనాథాయ తే నమః ॥ 217

**ఫలశ్రుతి :**

ఇదం నామసహస్రం మే రుద్రేణ పరికీర్తితమ్ ।
యః పఠేత్ పాఠయేద్వాపి స ఏవ మమ సేవకః ॥

యంయం చింతయతే కామం కారంకారం ప్రియాకృతిమ్ ।
యః శ్రుణోతి దురాయస్తం తంతం ప్రాప్నోతి మామకః ॥

రాజద్వారే శ్మశానే తు పృథివ్యాం జలసన్నిధౌ ।
యః పఠేన్మానవో నిత్యం స శూరః స్యాన్న సంశయః ॥

ఏకకాలం ద్వికాలం వా త్రికాలం వా పఠేన్నరః ।
స భవేద్ బుద్ధిమాన్‌లోకే సత్యమేవ న సంశయః ॥

యః శృణోతి నరో భక్త్యా స ఏవ గుణసాగరః ।
యః శ్రద్ధయా రాత్రికాలే శృణోతి పఠతే చ వా ॥

స ఏవ సాధకః ప్రోక్తః సర్వదుష్ట వినాశకః ।
అర్ధరాత్రే పఠేద్యస్తు స ఏవ పురుషోత్తమః ॥

త్రిసంధ్యయో దేవగృహే శ్మశానే చ విశేషతః ।
వనే చ మార్గగమనే బలే దుర్జనసన్నిధౌ ॥

యః పఠేత్ ప్రయతో నిత్యం స సుఖీ స్యాన్న సంశయః ।
విద్యార్థీ లభతే విద్యాం ధనార్థీ లభతే ధనమ్ ॥

శౌర్యార్థీ లభతే శౌర్యం పుత్రార్థీ పుత్రమాప్నుయాత్ ।
ఏవం వింశతిమన్త్రేణ అక్షరేణ సహైవ చ ॥ 9

యః పఠేత్ ప్రాతరుత్థాయ సర్వకామమవాప్నుయాత్ ।
రసార్థీ పాఠమాత్రేణ రసంప్రాప్నోతి నిత్యశః ॥

అన్నార్థీ లభతే చాన్నం సుఖార్థీ సుఖమాప్నుయాత్ ।
రోగీ ప్రముచ్యతే రోగాద్బద్ధో ముచ్యేత బంధనాత్ ॥

శాపార్థీ లభతే శాపం సర్వశత్రువినాశనమ్ ।
స్థావరం జంగమం వాపి విషం సర్వం ప్రణశ్యతి ॥

సర్వలోక ప్రియః శాంతో మాతృప్రియకరశ్చయః ।
సంగ్రామే విజయస్తస్య యః పఠేత్ భక్తి సంయుతః ॥

సర్వత్ర జయదం దేవీ స్తోత్రమేతత్ ప్రకీర్తితమ్ ।
ఇదం స్తోత్రం మహత్పుణ్యం నిన్దకాయ న దర్శయేత్ ॥

అసాధకాయ దుష్టాయ మాతృపితృవికారిణే ।
అధార్మికాకులీనాభ్యాం నైతత్స్తోత్రం ప్రకాశయేత్ ॥

సాధకాయ చ భక్తాయ యోగినే ధార్మికాయ చ ।
గురుభక్తాయ శాన్తాయ దర్శయేత్ సాధకోత్తమః ॥

ఇదం స్తోత్రం చ రుద్రేణ రామస్యాపి ముఖేర్పితమ్ ।
తన్ముఖాన్నిఃసృతం లోకే దరిద్రాయాపి సాధవే ॥

రామేణ కథితం భ్రాత్రే లక్ష్మణాయ మహాత్మనే ।
తతో దుర్వాససా ప్రాప్తం పాండవేన తథైవచ ॥

పాండవోప్య బ్రవీత్ కృష్ణం కృష్ణనేనేదం ప్రకీర్తితమ్ ।
అస్యస్తోత్రస్య మాహాత్మ్యం రామో జానాతి తత్త్వతః ॥

రామోపి రాజ్యం సంప్రాప్తో హ్యస్య స్తోత్రస్య పాఠతః ।
పాండవోపి తథారాజ్యం సంప్రాప్తో భైరవస్య చ ॥

అనేన స్తోత్రపాఠేన కిమలభ్యం భవేదితి ।
సర్వలోకస్య పూజ్యస్తు జాయతే నాత్ర సంశయః ॥ 21

# వటుక భైరవ – అష్టోత్తర శతనామ స్తోత్రం

ఓం హ్రీం భైరవో భూతనాథశ్చ భూతాత్మా భూతభావనః ।
క్షేత్రజ్ఞః క్షేత్రపాలశ్చ క్షేత్రదః క్షత్రియో విరాట్ ॥

శ్మశానవాసీ మాంసాశీ ఖర్పరాశీ స్మరాన్తకృత్ ।
రక్తపః పానపః సిద్ధః సిద్ధిదః సిద్ధసేవితః ॥

కంకాలః కాలశమనః కాలకాష్ఠాతనుః కవిః ।
త్రినేత్రో బహునేత్రశ్చ తథా పింగళలోచనః ॥

శూలపాణిః ఖడ్గపాణిః కంకాళీ ధూమ్రలోచనః ।
అభీరో భైరవీనాథో భూతపో యోగినీపతిః ॥
ధనదో ధనహారీ చ ధనుష్మాన్ ప్రీతి భావనః ।
నాగహారో నాగకేశో వ్యోమకేశః కపాలభృత్ ॥

కాలః కపాలమాలీ చ కమినీయః కళానిధిః ।
త్రిలోచనో జ్ఞాననేత్రస్త్రిశిఖీ చ త్రిలోకభృత్ ॥

త్రినేత్రతనయో డింభః శాంతః శాంతజనప్రియః ।
వటుకో వటుకేశశ్చ ఖట్వాంగవరధారకః ॥

భూతాధ్యక్షః పశుతిర్భిక్షుకః పరిచారకః ।
ధూర్తో దిగింబరశ్శూరో హరిణః పాండులోచనః ॥

ప్రశాంతః శాంతిదః సిద్ధః శంకరః ప్రియబాంధవః ।
అష్టమూర్తిర్నిధీశశ్చ జ్ఞానచక్షుస్తపోమయః ॥

అష్టాధారః షడాధారః సర్పయుక్తః శిఖీసుఖః ।
భూధరో భూదరాధీశో భూపతిర్భూధరాత్మజః ॥

కపాలధారీ ముండీ చ నాగయజ్ఞోపవీతవాన్ ।
జృంభణో మోహనఃస్తంభీ మారణః క్షోభణస్తథా ॥

శుద్ధ నీలాంజనప్రఖ్య దేహ ముండ విభూషణః ।
బలిభుగ్ బలిభుజ్నాథో బాలో బాలపరాక్రమః ॥

సర్వాపదుద్ధరో దుర్గో దుష్టభూతనిషేవితః ।
కామీ కళానిధిః కాన్తః కామినీ వశకృద్వశీ ॥

సర్వసిద్ధిప్రదో వైద్యః ప్రభుర్విష్ణురితీవ హి ।
అష్టోత్తరశతం నామ్నాం భైరవస్య మహాత్మనః ॥

# శ్రీ కాలభైరవాష్టకమ్

దేవరాజ సేవ్యమాన పావనాంఘ్రిపంకజం
వ్యాళయజ్ఞసూత్రమిందు శేఖరం కృపాకరం
నారదాదియోగిబృందవందితం దిగంబరం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే ॥ 1

భానుకోటి భాస్వరం భవాబ్ధితారకం పరం
నీలకంఠమీప్సితార్థదాయకం త్రిలోచనం
కాలకాలమంబుజాక్షమక్షశూలమక్షరం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే ॥ 2

శూలటంక పాశ దండపాణి మాదికారణం
శ్యామకాయ మాదిదేవ మక్షరం నిరామయం
భీమవిక్రమం ప్రభుం విచిత్ర పాండవ ప్రియం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే ॥ 3

భుక్తిముక్తి దాయకం ప్రశస్త చారు విగ్రహం
భక్తవత్సలం స్థితం సమస్త లోకనిగ్రహం

నిక్వణన్మనోజ్ఞహేమకింకిణీలసత్కటిం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే ॥ 4

ధర్మసేతు పాలకం త్వధర్మమార్గ నాశకం
కర్మపాశ మోచకం సుశర్మ దాయకం విభుం
స్వర్ణవర్ణ కేశపాశ శోభితాంగ మండలం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే ॥ 5

రత్నపాదుకాప్రభాభిరామ పాదయుగ్మకం
నిత్యమద్వితీయ మిష్ట దైవతం నిరంజనం
మృత్యుదర్పనాశనం కరాళ దంష్ట్ర భీషణం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే ॥ 6

అట్టహాసభిన్నపద్మజాండకోటి సంతతిం
దృష్టిపాత నష్టపాపజాలముగ్రనాశనం
అష్టసిద్ధిదాయకం కపాలమాలికాధరం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే ॥ 7

భూతసంఘనాయకం విశాలకీర్తిదాయకం
కాశివాసిలోకపుణ్యపాపశోధకం విభుం
నీతిమార్గకోవిదం పురాతనం జగత్ప్రభుం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే ॥ 8

**ఫలశ్రుతి :**

కాలభైరవాష్టకం పఠంతి యే మనోహరం
జ్ఞానముక్తి సాధనం విచిత్ర పుణ్యవర్ధనం
శోకమోహదైన్యలోభకోపతాపనాశనం
తే ప్రయాంతి కాలభైరవాంఘ్రి సన్నిధిం ధ్రువమ్



# తీక్ష్ణదంష్ట్ర కాలభైరవాష్టకమ్

యంయంయం యక్షరూపం దశదిశివిదితం భూమికంపాయమానం
సంసం సంహారమూర్తిం శిరముకుటజటా శేఖరం చంద్రబింబమ్ ।
దందందం దీర్ఘకాయం వికృతనఖముఖం చోర్ధ్వ రోమం కరాళం
పంపంపం పాపనాశం ప్రణమత సతతం భైరవం క్షేత్రపాలమ్ ॥ 1

రంరంరం రక్తవర్ణం కటికటితతనుం తీక్ష్ణ దంష్ట్రాకరాళం
ఘం ఘం ఘం ఘోషఘోషం ఘఘఘఘ ఘటితం ఘర్ఘరం ఘోరనాదమ్ ।
కంకంకం కాలపాశం ధృకధృక ధృకితం జ్వాలితం కామదేహం
తంతంతం దివ్యదేహం ప్రణమత సతతం భైరవం క్షేత్రపాలమ్ ॥ 2

లంలంలంలం వదంతం లలలల లలితం దీర్ఘజిహ్వా కరాళం
ధుంధుంధుం ధూమ్రవర్ణం స్ఫుటవికటముఖం భాస్కరం భీమరూపమ్ ।
రుంరుంరుం రుండమాలం రవితను నియతం తామ్రనేత్రం కరాళం
నంనంనం నగ్నభూషం ప్రణమత సతతం భైరవం క్షేత్రపాలమ్ ॥ 3

పంపంపం వాయువేగం నతజనసదయం బ్రహ్మాపారం పరం తం
ఖంఖంఖం ఖడ్గహస్తం త్రిభువనవిలయం భాస్కరం భీమరూపమ్ ।
చంచంచంచం చలిత్వా చలచలచలితా చ్చాలితం భూమిచక్రం
మంమంమం మాయిరూపం ప్రణమత సతతం భైరవం క్షేత్రపాలమ్ ॥ 4

శంశంశం శంఖహస్తం శశికరధవళం మోక్షసంపూర్ణతేజం
మంమంమంమం మహాంతం కులమకుళకులం మంత్ర గుప్తం సునిత్యమ్ ।
యంయంయం భూతనాథం కిలికిలికలితం బాలకేళిప్రధానం
అంఅంఅం అంతరిక్షం ప్రణమత సతతం భైరవం క్షేత్రపాలమ్ ॥ 5

ఖంఖంఖం ఖడ్గభేదం విషమమృతమయం కాలకాలం కరాళం
క్షంక్షంక్షం క్షిప్రవేగం దహదహదహనం తప్తసందీప్యమానమ్ ।
హౌంహౌంహౌం కారనాదం ప్రకటిత గహనం గర్జితైర్భూమికంపం
వంవంవం వాలలీలం ప్రణమత సతతం భైరవం క్షేత్రపాలమ్ ॥ 6

సంసంసం సిద్ధియోగం సకలగుణమఖం దేవదేవం ప్రసన్నం
పంపంపం పద్మనాథం హరిహరమయనం చంద్రసూర్యాగ్ని నేత్రమ్
ఐంఐం ఐశ్వర్యనాథం సతతభయహరం పూర్వదేవ స్వరూపం
రౌంరౌంరౌం రౌద్రరూపం ప్రణమత సతతం భైరవం క్షేత్రపాలమ్ ॥ 7

హంహంహం హంసయానం హపితకలహకం ముక్తయోగాట్టహాసం
ధంధంధం నేత్రరూపం శిరముకుటజటాబంధ బంధాగ్రహస్తమ్ ।
టంటం టంకారనాదం త్రిదశలటలటం కామగర్వాపహారం
భృంభృంభృం భూతనాథం ప్రణమత సతతం భైరవం క్షేత్రపాలమ్ ॥ 8

ఇత్యేవం కామయుక్తం ప్రపఠతి నియతం భైరవస్యాష్టకం యో
నిర్విఘ్నం దుఃఖనాశం సురభయహరణం డాకినీశాకినీనామ్
నశ్యేద్ధి వ్యాఘ్రసర్పౌహుతవహసలిలే రాజ్యశంసస్య శూన్యం
సర్వానశ్యంతి దూరం విపద ఇతి భృశం చింతనాత్సర్వసిద్ధిమ్ 9

భైరవస్యాష్టక మిదం షాణ్మాసం యః పఠేన్నరః
న యాతి పరమం స్థానం యత్రదేవో మహేశ్వరః 10



